

# శ్రీ మదంబా భవాని తారావళి

ఓమ్ హింగులాంబికా భ్యోనమః

శ్రీమదంబా భవాని తారావళి

శ్రీ మన్మహాశక్తి చిద్రూపిణీశ్వరీ
ప్రణవపంజరశుకీ భవ్యచరితె
ప్రథమపూజితలోక, పావన పదపద్మె
నిగమోపవనల సన్నీలకంఠే
చంద్రికాదరహాసె, చండాముండాసుర
ప్రాణాపహరణల ప్రౌఢలసితె
మత్తదంతావళి మర్దన వాహినీ
వనజాతజిత్వర వదనబింబె.

గీ॥ పరమ కళ్యాణితత్వాద, భజననెపుడు
భక్తితోజేతునమ్మ్రోవ, భావ్యమమ్మ
వసుధ జమ్మలమడుగు ని. వాసనీ.వ
భాంగిమాంపాహిజగదాంబ, హింగులాంబ

## శ్రీమదంబా భవాని తారావళి

సీ॥ ఆదిపరంజ్యోతి, యమృతస్వరూపిణీ
భక్తసంరక్షణీ, పాపహారిణి
రాజరాజేశ్వరీ, రజితాద్రిమందిరే
నిర్వాణసందాయ, నీ, మృడాని
దాక్షాయణీదుర్గి, దాశార్హసోదరి
యుత్తగకులాహిత, తురగజనని
వైష్ణవీశాంభవీ, వారాహిచాముండి
భద్రకాళీశ్వరి, రుద్రదేవి.

గీ॥ నిరుపమాన, కృపావీక్షణీ, సమస్త
లోక శుభదాయనీ, భక్త, లోకవరద
వసుధ జమ్మలమడుగు ని, వాసనీ, శు
భాంగి మాంపాహి జగదాంబ, హింగులాంబ

శ్రీ మదాంబా భవాని తారాదావళి

సీ॥ చందనకర్పూర, శారాదనారాద
మందార హిమశైల హారవైరి
దర్వీకరాధీశ, శర్వరి నాయక
కేశరి చంద్రిక, వాసవేభ
గగన ధునీక్షీర కాదంబ సురధేను
నక్షత్రపాండుర, నలినకుంద
భారతీ శతకోటి, నారదదుగ్ధాబ్ధి
కావ్యనీలాంబరా, కంబుహార

గీ॥ ధవళ జిత్వర మగుచునీ, తతయశంబు
సర్వదిగ్భాగముల నిండె, సత్యమమ్మ
వసుధ జమ్మలమడుగు ని, వాసినీ శు
భాంగి మాంపాహి జగదాంబ, హింగులాంబ.

శ్రీ సుదాంబా భవాని తారాదావళి

సీ॥ విహగ రాడ్వాహుండు వింజామరము వీవ
హాకారి ఛత్రంబు, బట్టినిలువ
పరమేష్ఠివేదముల్, పఠనంబు గావింప
మునిజనమ్ములు సూక్తములను చదువ
అసురులు ముకళిత, హస్తులై కొలువంగ
విఘ్నేశ్వరుడు దాండ, వించు చుండ
ఘనభక్తికిన్నరుల్, గానంబు లొనరింప
సాకృతెందురులు ని, ష్ఠాభక్తివ్వ

గీ॥ పరమ మోదంబు మీఱంగ, భద్రపీఠి
సమృద్ధికైశ్వర్యమున నిల్చి. జగత్ప్రోచు
వసుధ జమ్మలమడుగు ని, వాసినీ, శి
ఖాంగి మాంపాహి జగదాంబ హింగులాంబ

## శ్రీ మదంబా భవాని తారావళి

సీ॥ దివ్య తేజఃఖనే, దీవార్తి రంజినే
నిరుపమ సుగుణాధి, నికరభరితే
తాపసాగ్రేసరా, దహర సంచారిణే
మృగవర రోహణే, హింగులాంబ
పాల లోచన తనూ, వామ భోగోజ్వలే
సర్వమంగళ మూష, కార్వమాతె
శరణాగత నేక, సాధు చింతామణే
మత్త మాతంగ స మాస గమనె

గీ॥ పల్లవాస్త్రవిదారణీ, యెల్లమాంబ
హైమవతి లోక మాత న, న్నాదరింపు
వసుధ జమ్మలమడుగు ని , వాసినీ శు
భాంగి మాంపాహి జగదాంబ, హింగులాంబ.

## శ్రీమదంబా భవాని తారావళి

సీ॥ సర్వచరాచరా, సత్యప్రకాశనీ
నాదకళాబిందు, యాదిశక్తి
పరిణవాక్షరీ వేద, ప్రథమ పూజితె దేవి
వివిధ కళామయా, విశ్వరూపె
స్త్రీపుంనపుంభేద, చిన్మయాకారిణీ
సంపూర్ణయౌవన, చారుగాత్రె
సత్వరజస్తమో, సర్వ స్వరూపిణీ
దేహాదేహాంతర, దివ్యతేజె

గీ॥ నిర్మలానందమూర్తియో, నిర్వికారి
దీనబంధు చింతామణీ, ధీవిశాలి
వసుధ జమ్మలమడుగు ని, వాసినీ శు
భాంగి మాంపాహి జగదాంబ హింగులాంబ

శ్రీమదంబా భవాని తారావళి

సీ॥ ముగురు మూర్తుల కీవు ముదితవై దల్లివై
గాఢానురక్తిచే, కాచినావు
దనుజుల తపియింప, ధారుణాయుధ దీప్తి
వెలుగ రక్తాక్షివై, వెలసినావు
మోక్షులునిను వేడ, ముక్తివధూటివై
మోక్షార్థములని చ్చి, బ్రోచినావు
శాస్త్రార్థములనెల్ల, చదివితర్కింపగ
వేదనిర్మాతవై వెలచినావు

గీ॥ అరయనీకంటె హెచ్చైన, దైవమెవరు
నిఖిల పురుషార్థ శుభదాయ నీ. మృడాని
వసుధ జమ్మలమడుగు నీ' వాసన్నీశ
భాంగిమాంపాహి జగదాంబ, హింగులాంబ

## శ్రీ మదంబా భవాని తారావళి

సీ॥ దుష్టదైత్యవినాశ, ధూమకేతువు నీవె
దేవ వధూసౌఖ్య, దిక్కునీవె
కదనాస్త్రలీని వీర, కౌతుకరంబననీవె
కవిజనాది సుకీర్తి, కాంతనీవె
సభలందు మర్యాద, సంఘటించను నీవె
బహుమాన వరపూజ్య, బంధునీవె
అతిమరక్కవాదంబు; యణగ ద్రొక్కను నీవె
యొంటి జిక్కిన వేళ, బంటునీవె

గీ॥ పరమపావని మాపాలి వ్రతమువీవె
విమలసువిలాస మాయిలు వేల్పువీవె
వసుధ జిమ్మలమడుగు ని, వాసినీ శు
భాంగిమాంపాహి జగదాంబ, హింగులాంబ.

శ్రీ మదంబా భవాని తారావళి

సీ॥ సంపూర్ణపూర్ణిమ, చంద్రబింబాననే
సుందర ధావళ్య, మందహాసె
నిరుపమ హరిహాంయ, నీలశిరోరుహె
భాసుర రాజీవ, పత్రనయనె
పక్వబింబాధరే, పల్లవారుణకరే
భూ్రియుగ విజితాత్మ, భూతనాశె
కంబుసన్నిభగళె, క్రమవాక్యోజ్వలే
మంజుల కుంద స మానరదనె

గీ॥ దేవకాంత సమర్చిత, దివ్యపాదె
నగకులేంద్రాత్మజ సదా, నందశివె,
వసుధ జమ్మలమడుగు ని . వాసినీ శు
భాంగిమాంపాహి జగదాంబ, హింగులాంబ.

## శ్రీమదంబా భవానీ తారావళి

సీ॥ విశ్వనిర్మాతవై, వెలుగొందు బ్రహ్మచే
పరుల కసాధ్యమౌ, వరములంది
ఎదురెందులేకను, మదమున దుష్టుడై
దేవజాలముల న, ద్దిశలదోలి
గంధర్వులను మోది, గరుడుల న్నాక్రమించి
కిన్నెరులనుబట్టి, వన్నెమాపి
సిద్ధుల నురగుల, బద్ధులగావించి
ప్రళయాగ్నికీలల, పగదిరేగి,

గీ॥ భువనములనెల్ల బాధించు, పురనిశాట
హనన మొనరించు శంభు న, ర్ధాంగివమ్మ
వసుధ జమ్మలమడుగు ని, వాసినీశి
ఖాంగి మాధవాహా జగదాంబ, హింగులాంబ.

## శ్రీమదంబా భవాని తారావళి

సీ॥ సింహవాహనమెక్కి, చెలరేగిజూచిన
గడగడవలుచెడ, ల్వడకునమ్మ
కన్నులెఱ్ఱగజేసి, ఖడ్గంబుబూనిన
యసురులగుండియ, లదరునమ్మ
శంఖంబుపూరించి, సంగరరంబున నిల్వ
యట్టిట్టుగగన మ, ల్లాడునమ్మ
డమరు కరంబుతో, విమతులదాకిన
శేషునిఫణములు చెదురునమ్మ

గీ॥ విలయ మేఘూర్భటిని నీవు వీరసింహ
రవమొనర్పగ దిగ్దంతు, లవయునమ్మ
వసుధ జమ్మల్లమడుగు ని, వాసినీ శు
భాంగి మాంపాహి జగదాంబ, హింగులాంబ.

శ్రీ షుదంబా భవాని తారావళి

సీ॥ క్షోణిధరోద్ధరె శక్తిముక్తామణీ
భక్తజనావన, భాసిజమానె
ఋతవాగ్విశారదే వితత యశోధనే
సుప్రసన్నాననే, శుద్ధచరితె
ఉపనిషత్కళికా, విపిన వనప్రియే
శుభలక్షణోపేత, సురుచిరాంగి
భువనత్రయశ్రేష్ఠ, భోగవిరాజితే
దోషాప్రబపటల నిర్ధూతపవనె

గీ॥ భూరిసుక్రోరససుధా, పూర్ణలహరి
చారుమణి నూపురోజ్వల, చరణయుగళె
వసుధ జిమ్మలమడుగు ని, వాసినీ శు
భాంగి మాంపాహి జగదాంబ హింగులాంబ

## శ్రీ మదంబా భవాని తారావళి

సీ॥ బాహోద్ధతినిమించి, షట్భద్రుల బట్టి
కోపానలంబున రూపుమాపి
వరవీరధుర్యుల, దురమునసాధించి:
వివిధభూతాళికి, విందొనర్చి
పటులాహితులనాజి, శస్త్రాస్త్రవితతికి
బలియిచ్చినత్యాంత, హృద్ధిమెఱపి
పరగిడువారల బట్టినేలనుగూల్చి
బాలుర నిసువుల, నేలగలిపి,

గీ॥ క్షాత్రనతిగర్వములజించు, జామదాగ్న్య
భీతిహరియించి నృపుల సం ప్రీతిజూచు
వసుధ జమ్మలమడుగు ని, వాసినీ శ
భాంగిమాంపాహి జగదాంబ, హింగులాంబ.

శ్రీమదంబా భవాని తారావళి

సీ॥ నిరతంబు నీపాద, నీరజంబులు గొల్చు
దాసులరక్షించు తల్లివమ్మ
సతతంబు నీనామ, సంకీర్తనము చేయు
దీనులపాలించు, దేవివమ్మ
మరియుచునీదివ్య, మూర్తి జూడగనెంచు
మౌనులబోషించు మాతవమ్మ
విడువక నీకథ, ల్వినె యభీష్టము నొందు
ధన్యులగడ దేర్చు, దాతవమ్మ
గీ॥ యిన్ని విధముల పేరొంది, యున్న నీకు
వందనము సేయననుగావ, వలదె జనని
వసుధ జిమ్మలమడుగు ని, వాసినీ శు
భాంగి మాంపాహి జగదాంబ హింగులాంబ

శ్రీమదంబా భవాని తారావళి

సీ॥ నిసురణంబున జూచి నివ్వెరపాటొంది
దిగ్భ్రమ జెందరే దివిజరిపులు
నీ పేరు చెవిసోక, నిలుచబోటును వీడి
పాప పుంజంబులు, పరుగులిడవె
నీమంగళాకృతి, నిండారగాంచిన
భక్తులకోర్కెలు, పండుటలుదే
నీదివ్యమంత్రంబు, నిత్యంబుపఠియింప
కరతలామలకంబు, గాదెముక్తి

గీ॥ యిన్నివిధముల ముఖ్యమై, యున్ననిన్ను
నన్నుతించిన నన్ముబ్రోవ, కున్నయశమె
వసుధ జిమ్మలమడుగు ని, వాసినీ శు
భాంగి. మాంపాహి జగదాంబ. హింగులాంబ

శ్రీ మదంబా భవాని తారావళి

సీ॥ విశ్వదిగ్మండ లో, కేశ్వరీయీశ్వరీ
పరమంత్రపరతంత్ర, భయ నివారె
శాఖినీ భూత పిశాచాది భేతాళ
బ్రహ్మరాక్షస కోటి, భయనివారె
సర్వవశీకరీ, సాధుచింతామణీ
బాలగ్రహారోగ, భయనివారె
ఘన మోహినీభూత, కామినీ ఢాకినీ
పరబాధ చోరాది, భయ నివారె

గీ॥ చెండి తంతు భైరవమారి, మొండియేటు
దాటువాటుకురిల విద్య, ధ్వంసి నీవె
వసుధ జమ్మలమడుగు ని, వాసినీ శ
భాంగిమాంపాహి జగదాంబ, హింగులాంబ.

శ్రీ మదంబా భవాని తారావళి

సీ॥ దిక్కులు పటపట, వ్రక్కలై బ్రోవంగ
పర్వత గుహలెల్ల, బదులుమ్రోయ
మార్తాండ చంద్రులు, మార్గముల్దప్పంగ
పాతాలలోకంబు, భగ్గుమనగ
వార్ధులేడును గూడి, వారకఘూర్ణిల్ల
ననిమిష లద్భుతం, బనుచుబెగడ
భీకరా రావగం, భీరమైవిలసిల్లు
రణభేరి మ్రోయించి, రహ్వాగతిని

గీ॥ శౌర్యులగు చండ ముండామి, షాశనులను
వధముగావించు విక్రమో. జ్వలనునీవె
వసుధ జిమ్మలమడుగు ని , వాసినీ శు
భాంగిమాంపాహి జగదాంబ, హింగులాంబ.

శ్రీమదంబా భవాని తారావళి

సీ॥ ఏ శాస్త్రిమందెల్ల, వెదక (సర్వంశక్తి
మయము) జగత్తను, మహిమగలదె
ఏయోగ సేవించి, వేద ( సర్వంశక్తి
మయము జగత్తను, )మహిమగలదె
ఏగురుగనుగొని, వినిన ( సర్వంశక్తి
మయము ) జగత్తను, మహిమగలదె
ఏభోధలిన్నను, యెఱుక ( సర్వంశక్తి
మయము ) జగత్తను, మహిమగలదె

గీ॥ సకల భువనేశ్వరీశ్వరీ, శార్వరాణి
బ్రహ్మివైష్ణవీ శాంభవీ, బగళనీవె
వసుధ జమ్మలమడుగు ని, వాసనీ.శ
భాంగి మాంపాహి జగదాంబ, హింగుళాంబ

శ్రీమదంబా భవాని తారావళి

సీ॥ కుటిలదైత్యుల బట్టి, కుత్తుకల్దెగగోసి
గుటగుట రక్తంబు. గ్రోలినావు
చనటి దైత్యులబట్టి, చననీక బిగబట్టి
ఫెళ ఫెళ నెముకల విఱచినావు
దుష్ట దైత్యులబట్టి నష్టప్రాణులజేయ
కఱ కఱ కఱ కఱా, దఱగినావు
ఘోర దైత్యులబట్టి, కుంభినీ బడమొత్తి
వీరనృత్యమ్ము గావించినావు.

గీ॥ భళిరె నీలావు బొగడంగ, బ్రహ్మతరమె
వీరమోహిని త్రిపురారి, విశ్వజనని
వసుధ జమ్మలమడుగు ని, వాసనీ,శ
ర్వాంగి మాంపాహి [illegible], హింగులాంబ

శ్రీమదంబా భవాని తారావళి

సీ॥ జయజయభారతి, జయప్రకాశినే
జయజయ వాసవీ, జయమృడాని
జయజయదైత్యారి, జయజగన్మోహినీ
జయజయరేణుకా, జయభవాని
జయజయయాశ్వరి, జయజగత్పావని
జయజయగీర్వాణి, జయయపర్ణ
జయజయసావిత్రి జయమౌని సంస్తోత్రి
జయజయనగరాజ జనిత శక్తి

గీ॥ దివ్యమకుట సుభూష దే దివ్యమానె
సుందర లలాట కుంకుమ శోభయుక్త
వసుధ జమ్మలమడుగు ని, వాసనీ,భ
భాంబ్రి మాంపాహి జగదాంబ, హింగులాంబ

## శ్రీ మదాంబా భవాని తారావళి

సీ॥ వీక్షించితివి భక్త, వేడుకల్మీనివార
నాదరించవను కృపా, రసముజెలగ
శిక్షించితివి ఘోర, రాక్షసావళినెల్ల
మ్ముల్లోకములు బహూ, మోదమంద
రక్షించితివి దేవ, రాష్ట్రవృందములనెల్ల
సహనభాగములవే, సౌఖ్యమంద
భక్షించితివి మహా, పాపకర్మలనెల్ల
క్ష్మాదేవి యత్యంత, శాంతమంద.

గీ॥ దక్షనందన యాదిమ, శక్తిరహిత
రక్షితామరమూర్తి శ్రీ, రమణిసుగుణి
వసుధ జమ్ములనుడుగు ని, వాసినీ, శ
ర్వాంగి మాంపాహి జగదాంబ హింగులాంబ

శ్రీ మదాంబా భవాని శ్లోకావళిని ఎవ్వరైననూ. ఆదేవి యెదుట నిలిచి స్తుతించినవారికి, వారి కుటుంబ సభ్యులకు సర్వసుఖములు ఆకరుణామయి అగు మాత ఒసగువని, అందుచే సర్వజనులు శ్రీ భవాని కృపా కటాక్ష వీక్షణములకు. పాత్రులగుదురని మా నమ్మిక.



॥ స ర్వే జ న సు ఖి నో భ వం తు ॥

